## గంటల పంచాంగం

నందన సంవత్సర ఆశ్వయుజ శు॥ చవితి 1952 సం॥ సెప్టెంబరు 23 మంగళవారం శు॥ చవితి రా 4-37 స్వాతి ఉ 7-0 వర్జ్యం ప 12-46 ల 2-24 వ.
శ॥ పంచమి సెప్టెంబరు 24 బుధవారం శు॥ పంచమి రా 4-25 విశా ఉ 7-39 వర్జ్యం ప 11-41 ల 1-18 వ.


# ఆంధ్రపత్రిక

ఒకరేయుని యొనరించిన నరవర
యుష్పియము శవ మసంబాన కగు దా
గాడుకు వవిసేయుటకి నరాయణము
వరమధర్మపదము తెల్పన్-(మహాభారతము)

నందన సం॥ ఆశ్వయుజ శు॥ చవితి
మంగళవారం


## దక్షిణాఫ్రికా సమస్య

దక్షిణ ఆఫ్రికా జెయిళ్లు నిండిపోతున్నవి. ఇప్పటికి మలాన్ ప్రభుత్వం నాలుగువేల మంది సత్యాగ్రహులను అరెస్టు చేసింది. ఈ సాత్విక నిరోధక ఉద్యమం ఈ విధంగానే సాగితే, పనివారు లేక పరిశ్రమలన్నీ మూలబడవలసి వస్తుందనీ, శ్వేత జాతులవారు నిలవడానికి ఆస్కారం లేకుండా పోతుందని ఆఫ్రికాలోని యూరపియన్లే ఆందోళన చేస్తున్నారు. ఆఫ్రికన్ల, భారతీయుల సత్యాగ్రహం ఉద్యమం రోజురోజుకూ విస్తృతమౌతున్నది. తీవ్రమౌతున్నది. ఈ ఉద్యమాన్ని అణచివేయడానికి మలాన్ ప్రభుత్వం తీసుకుంటున్న ప్రతి ఒక్క చర్యా ఉద్యమాన్ని బలపరుస్తున్నది. ఈ సత్యాగ్రహ ఉద్యమంవల్ల ఏర్పడిన పరిస్థితిని ఐక్యరాజ్య సమితి చర్చించాలని ఆసియా, అరబ్ రాజ్యాలు చేసిన ప్రతిపాదన సమితి నిబంధనలు అడ్డుపడినందువల్ల సర్వసభ్య సమావేశంలో చర్చకు రాకపోయినా మలాన్ ప్రభుత్వ జాతి విచక్షణ విధానాన్ని నాగరిక ప్రపంచం ఎంతమాత్రం హర్షించడం లేదని స్పష్టమైంది. వాస్తవానికి మలాన్ ప్రభుత్వం దక్షిణాఫ్రికా భారతీయులను చూస్తున్న విధాన్ని ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశం ఏటా తీవ్రంగా విమర్శిస్తూనే వుంది.

దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యా పరిష్కారానికి సమితి సర్వసభ్య సమావేశం ఎన్నో ప్రతిపాదనలు చేసింది. తీర్మానాలన్నీ మలాన్ ప్రభుత్వ మంకుపట్టువల్ల సమితి అసమర్థతవల్ల నిరర్థకమైనవి. సమితి సర్వసభ్య సమావేశం ఎనిమిది మాసాల క్రితం ఒక తీర్మానంచేస్తే ఇప్పటికీ ఆ తీర్మానంమీద సమితి ప్రధాన కార్యదర్శి ఎలాంటి చర్య తీసుకోలేదంటే ఈ సమస్యపట్ల సమితికి వున్న శ్రద్ధ ఎంతమాత్రమో గ్రహించవచ్చును.

భారత ప్రభుత్వం పదేపదే జ్ఞాపకం చేయగా ఈ సంవత్సరం ఒకసారి రూపంలో సమితి చేసిన తీర్మానాన్ని పురస్కరించుకొని ప్రస్తుత పరిస్థితిపై నారి నారి అభిప్రాయాలను తెలుపవలసిందిగా కోరుతూ సమితి కార్యదర్శి దక్షిణాఫ్రికా పాకిస్తాన్ భారత దేశాల ప్రభుత్వాలకు వ్రాశారు. దక్షిణాఫ్రికాలో పరిస్థితి విషమించి శాంతికే ప్రమాదం ఏర్పడుతుందని భారత, పాకిస్తాన్ దేశాలు ఎన్నోసార్లు సమితి రాజ్యాలు ఇదివరకే తమ అభిప్రాయాలను ప్రకటించి వుండగా, ఆ అభిప్రాయాన్ని గమనించి తగుచర్య తీసుకోవడానికి బదులు, ఇవాళ ఇండియా, పాకిస్తాన్ల అభిప్రాయాలను తెలుసుకో గోరడం బట్టి ట్రిగ్వేలీ ఏదో లాంఛన మాత్రంగా చర్య తీసుకోవడానికే సంకల్పించినట్లు కన్పిస్తున్నది.

ఇలాంటి లేఖలవల్ల, చర్యలవల్లా, ఈ సమస్య పరిష్కారం కాదని సమితి కార్యదర్శి ఈ పాటికి గ్రహించి యుండవలసింది. దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులకు, ఇతర పౌరులకు వుంటున్న హక్కులను ఇవ్వవలసిందని ఐదేళ్ల క్రితం ఐక్యరాజ్య సమితి యూనియన్ ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఈ తీర్మానాన్ని పాటించడానికిబోగా దక్షిణఆఫ్రికా ప్రభుత్వం దేశంనుంచి భారతీయులను వారి దేశానికి తరిమివేయడం కంటే ఈ సమస్యా పరిష్కారానికి మరొక మార్గంలేదని భావించి తదనుగుణంగా చర్యలు తీసుకుంటున్నది.

దక్షిణ ఆఫ్రికా ఈవిధంగా వ్యవహరిస్తున్నంతకాలం సమితి ఆదేమనిఅన్నా అడిగిందిగాదు. దక్షిణాఫ్రికా సమితినుండి వెళ్లిపోతుందేమో అన్నభయంతో, పశ్చిమ రాజ్యాలు అక్కడ జరుగుతున్న అన్యాయాన్ని అరికట్టడానికి కఠినచర్యలు తీసుకోలేదు.

సమితి తీర్మానాలను తృణీకరించేందుకు ఒకవంక ప్రోత్సహిస్తూ మరొకవంక ఆ తీర్మానాలపై చర్యలు తీసుకోవడానికి లాంఛనమాత్ర ప్రయత్నాలుమాత్రమే చేస్తూవున్నంతకాలం ఈసమస్య పరిష్కారం కాదు.

## గుడివాడ పురపాలక సంఘం

### స్వతంత్రులుగా ఎన్నికైనవారు కాంగ్రెస్‌పార్టీగా వ్యవహరిస్తారట

గుడివాడ, సెప్టెంబరు 21: ఈ పురపాలక సంఘానికి స్వతంత్రులుగా ఎన్నికైన 17 గురు సభ్యులూ కాంగ్రెసుపార్టీగా వ్యవహరిస్తారని పట్టణ కాంగ్రెస్ అడ్‌హాక్ కమిటీ అధ్యక్షుడు డాక్టర్ నందివాడ విశ్వేశ్వరరావుగారు నేడు వెల్లడించారు.

మొత్తం 24 స్థానాలలో మిగతా 7 పౌరసమితి అభ్యర్థులకు లభించినవని తెలిసిందే. కాగా పు.పా. సంఘంలో కాంగ్రెసుకు తిరుగులేని మెజారిటీ వుంటుంది.

స్వతంత్రులుగా గెలుపొందిన ఈ 17 గురు సభ్యులనూ ఉద్దేశించిన అనంతరం విశ్వేశ్వరరావుగారి అధ్యక్షతను బహిరంగసభ జరిపారు. ఆ సభలో వారు ఈ విషయం వెల్లడించారు. వీరంతా ఏకోన్ముఖంగా పట్టణ పురోభివృద్ధికీ, కాంగ్రెసు ఆశయ సాఫల్యానికీ కృషిచేస్తారని ఆశిస్తున్నామన్నారు. ఎన్. వి. ఎస్. ప్రసాదరావుగారు ఈ 17 మందీ పురపాలనను సవ్యంగా జరిపించి, పౌరుల అభిమానం చూరగొనాలన్నారు. ఆదిరాజు అన్నపూర్ణేశ్వరరావు మాదెట్టి రామారావు, గొరిపర్తి బుచ్చిశాస్త్రి కోగంటి రాజబాపయ్యగార్లు ప్రసంగించాక ప్ర. భ. రంగాచారిగారి వందనాలతో సభ ముగిసింది.

పు. పా. సంఘానికి ఎన్నికైన న్యాయవాదులు గద్దెమణి వెంకట అప్పారావుగార్ల గౌరవార్థం న్యాయవాద సంఘంవారు తేనీటి విందు చేశారు. ఆ సందర్భంలో శివలెంక కృష్ణమూర్తిగారి అధ్యక్షతను జరిగిన సభలో వెయ్యేటి వెంకటరావు, దశక వెంకటేశ్వరరావు, జ్యోతి కామేశ్వరరావు, గాడ గోపీపతిరావుగార్లు పట్టణంలో విద్యాభివృద్ధికి, సమర్థపరిపాలనకు ఈసభ్యులిద్దరూ కృషి చేయాలని కోరుతూ ప్రసంగించారు. అతిను చిన్నా పట్టణాభివృద్ధికి శక్తికొలదీ పాటుపడతామన్నారు. స్వ. వి.

## పంచాయితీలకు ఎన్నికలు

### అక్టోబరు నుండి ప్రారంభం

మద్రాసు, సెప్టెంబరు 22: అక్టోబరు మొదలుకొని నవంబరులోపల రాష్ట్రంలోని 8,000 పంచాయితీల కయోజన సీటు ప్రకారం ఎన్నికలు జరుగగలవని, ఇంతవరకు ఆలస్యానికి కారణం అదనపు సీట్లంది లేకుండా వార్డులు విభజన యున్నను కార్యక్రమం పాటు నాసిన్నాఉంచబడే వనీ మిద శాసు స్థానికాధికారపుల్లలు నాయకంటి శంకరరెడ్డిగారు వెబ్ పత్రికా ప్రతినిధులకు తెల్పారు.

# రాయలసీమ ప్రజల దైన్యస్థితి

# పంటలనష్టం: పశుగ్రాసం కొరత

## అనేకచోట్ల మళ్లామంచినీటి ఎద్దడి

మద్రాసు, సెప్టెంబరు 21: రాయలసీమ జిల్లాలన్నింటిలోనూ కరవు పరిస్థితులు విషమంగా తయారైనవి. మేనెలలో కురిసిన వర్షాలకు వేసిన పునాసపైర్లన్నీ, ఆ తరువాత మళ్లీ వర్షం లేనందున పూర్తిగా ఎండిపోయినవి. పశుగ్రాసానికిగూడా కరవు యేర్పడింది; అనేకచోట్ల బావులు ఎండిపోయి మంచినీటికి మళ్ళా కరవు దాపురించింది. ఈ దుర్భర పరిస్థితులను గురించి ఆయా ప్రాంతాలనుంచి మాకు అందిన సమాచారమును యీ దిగువ ప్రచురిస్తున్నాం.

### రాయచోటి తాలూకా

కడపజిల్లా రాయచోటి తాలూకాలో క్షామ పరిస్థితులను గురించి, స్థానిక ప్రముఖులు యీ 18వ తేదీన ఆ తాలూకాలో పర్యటించి క్షామ నివారణ పనుల కమీషనరు హెజ్మాడీ గారికి సవివరంగా నివేదించుకొన్నారు. గంజికేంద్రాల సంఖ్య పెంచాలని, జీవనోపాధిలేక అల్లాడుతున్న పేద ప్రజలకు పనులు చూపించాలని, అనేకచోట్ల మంచినీటి కరవేర్పడింది గనుక లారీలద్వారా ఆయా గ్రామాలకు మంచినీరు సరఫరా చేయించాలని కోరారు.

హెజ్మాడీగారు తమ పర్యటన సందర్భంలో, వేనాపురం, చిన్నమండెం గంజికేంద్రాలను, దేవపట్ల గ్రామంలో రామకృష్ణ మిషన్‌వారిచే నడుపబడుతున్న ధాన్య దాన కేంద్రమును తనిఖీ చేశారు. ప్రతిచోటా పేద ప్రజానీకం, యీ గంజి కేంద్రాలు, యింకా కొంతకాలం సాగనివ్వండని కమీషనర్ గారిని కోరారు.

రాయచోటి తాలూకాలో 107 గంజి కేంద్రాలు, 64 చౌక ధాన్యం డిపోలు పనిచేస్తున్నవని వీటికి నెల వారీ 90 వేల రూ.లు ఖర్చు అవుతున్నదని, స్థానికాధికారులు కమీషనరుకు తెలియపర్చారు. ఇంతవరకూ వీనిపై మొత్తం 391 వేల రూ.లు ఖర్చు చేయబడినట్లు జిల్లా కలెక్టరు పర్సనల్ అసిస్టెంటు జి. జి. జేమ్సుగారు కమీషనరుకు చెప్పారు. రామకృష్ణ మిషన్‌వారు కడపజిల్లాలో 7 ధాన్య దాన కేంద్రాలను, 4 మధ్యాహ్న భోజన శాలలను, నడుపుతున్నారు. పేద ప్రజలకు రామకృష్ణ మిషన్‌వారు చేస్తున్న సేవను, హెజ్మాడీగారు శ్లాఘించారు. మల్లూరులో కమీషనర్ హెజ్మాడీగారు, యిటీవలే భారత సైన్యంచే లోతుగా త్రవ్వబడిన మంచినీటి బావి చూచారు. వండాడి హరిజనవాడలో, బావులు త్రవ్వేయంత్రం పనిచేస్తుండగా చూచారు.

గ్రామాలలో పర్యటన ముగించుకొని రాయచోటి పట్టణానికివచ్చిన అనంతరం క్షామపరిస్థితులనుగురించి, యింతవరకు అమలు జరిపిన సహాయ కార్యక్రమాలను గురించి స్థానికాధికారులతో చర్చించారు.

వై. ఆదినారాయణరెడ్డి ఎం. ఎల్. ఎ. డా॥ తిప్పారెడ్డి (రాయచోటి క్షామనివారణసంఘాధ్యక్షుడు) గారలు హెజ్మాడీగారికి విజ్ఞాపన సమర్పించారు. అందు, తాలూకా క్షామ పరిస్థితులనుగురించి వారీలా నివేదించారు. "వర్షాభావంవల్ల యీ తాలూకాలో, గడచిన ఐదేండ్లుగా క్షామపరిస్థితులేర్పడి ఉన్నవి. ఈ యేడుకూడా యీ పరిస్థితుల్లో మార్పేమీ లేదు".

మే నెలలో కురిసిన వర్షాలకు పైర్లు వేయగా, తరువాత మళ్లీ వర్షాలు లేనందున అవన్నీ పూర్తిగా ఎండిపోయినవనీ, రైతు అవస్థ దీనాతిదీనంగా ఉన్నదని, తాలూకాలో అనేకచోట్ల త్రాగు నీటికిగూడా కరవేర్పడిందని, ఆదినారాయణగారు చెప్పారు. 'చేయడానికి పనులు లేక, జీవనోపాధికి మరోమార్గం లేక, కూలిజనం, గంజి కేంద్రాలకు రాగలుగుతున్నారు. మరి కొందరు, యితర ప్రాంతాలకు వలసపోతున్నా'రని అన్నారు.

ఈ కూలిజనానికి జీవనోపాధి కల్పించాలంటే, మైనరు ఇరిగేషన్ ప్రాజెక్టులకు, ముఖ్యంగా కంచాలమ్మ చెరువు, ఊటుచెరువుపనులను ప్రారంభించాలని, వీలైతే "టెస్టు ఎక్స్‌క్వేజల"ను పెట్టించాలని, అలా చేసినట్లయితే, వలసపోయేకూలీలను నిలిపని అన్నచోటికి పంపడం వీలౌతుందని వీరు సూచించారు. అనేకచౌక పాన్యాలను చౌక ధరలకు యిప్పించినట్లయితే ప్రజల అవస్థ చాలావరకు తీరగలదని ఆదినారాయణగారు చెప్పారు.

తరువాత హెజ్మాడీగారు ఆడవారికి పని కల్పించే కేంద్రాన్ని చూచారు. అక్కడ 75 మంది స్త్రీలు పనిచేస్తున్నారు. స్త్రీజన సంక్షేమ ఉద్యోగి హెజ్మాడీగారికి, ఆ కేంద్రం వివిధ పనులను చూపి పని వివరించింది. రోజుకు గంజి, రోజు కూలి పని చేస్తున్నారని, బట్టలు లేనందున కష్టంగా వున్నదని చెప్పింది. హెజ్మాడీగారు రాయచోటి రాయలసీమ అనాథశిశు శిక్షణాలయం చూచారు. శిక్షణాలయాధ్యక్షుడు సభ్యులు విజ్ఞాపన సమర్పిస్తూ క్షామం అంటువ్యాధులవల్ల, తలిదండ్రులు పోయినారని అలాంటిపిల్లలకోసం యీ శిక్షణాలయం ప్రారంభించామని చెప్పారు. శిక్షణాలయంలో యిప్పుడు 80 మంది పిల్లలున్నారు. ఈ శిక్షణాలయమునకు ఉదారంగా గ్రాంటు యిప్పించాలని, కలెక్టరును, కమీషనర్ హెజ్మాడీగారిని కోరారు.

### కమలాపురం తాలూకా

ఈ తాలూకా కరవునివారణ సంఘ అధ్యక్ష కార్యదర్శులు, టి. కొండారెడ్డి, జి. సి. వెంకటరెడ్డి గారిలా వ్రాస్తున్నారు.

ఈ తాలూకా మెట్టగ్రామాల రైతులు వరుణదేవుని అనుగ్రహం కోసం ప్రతినిత్యమూ దీనవదనాలతో ఆకాశం వైపు చూస్తున్నారు. కాని యింతవరకూ చినుకులేదు. కమలాపురం ఫిర్కా మాగాణి రైతుల కష్టాలు వర్ణనాతీతం. నాలుగేండ్లు వర్షాలు లేక మాగాణి ఎండిపోయింది. కమలాపురం చెరువులో, చుక్క నీరుగూడ లేదు. పరిస్థితి యింత దుర్భరంగా ఉంటే ప్రభుత్వం కరవుపనులకు యేనాడో స్వస్తి చెప్పి గంజికేంద్రాలు పైతం (10) మూసి కరవు సహాయ కార్యక్రమం తగ్గిస్తున్నది. ఇప్పటికైనా మేల్కొని ప్రభుత్వం రైతాంగం కష్టాలు గమనించి కరవుప్రమాదాన్ని దృష్టిలో ఉంచుకొని సర్వ సన్నాహాలు చేస్తేగాని ముందు ముందు ఆకలిబాధలనుండి ప్రజలను రక్షించడం సాధ్యంగాదు.

పులివెందుల తాలూకా: యస్. శివరామరెడ్డి ఎం. ఎల్. ఎ. గారిలా వ్రాస్తున్నారు. వర్షాలులేక, వ్యవసాయ పనులులేక, అనేక గ్రామాలనుండి వ్యవసాయ కూలీలు పరాయిచోట్లకు వలసపోతున్నారు. ఈ తాలూకాలో కరవుపనులు యేనాడో మూసివేయబడినవి. నిరుద్యోగసమస్య పరిష్కరించి పనిపాటలులేని పేదజనానికి జీవనోపాధి కల్పించాలంటే, గండికోట ప్రాజెక్టుక్రింద కాలువలు త్రవ్వకం తక్షణం ప్రారంభించాలి. జీవనభృతి బుణాలను పెంచి రైతాంగానికి కూడా అందజేయాలి.

ప్రొద్దుటూరుతాలూకా: తాలూకా రైతుసంఘ సహాయ కార్యదర్శి వై. పక్కిరారెడ్డి యిలా వ్రాస్తున్నారు: "ఈ తాలూకాలో పునాసపైర్లు పూర్తిగా పోయినవి. మే నెల వర్షాలలో మందునది పొంగినందువల్ల, ఆ వరదలకు పశుగ్రాసంకొట్టుకొనిపోయింది. పేదప్రజలకు తిండిగింజలు లేవు. పశువులు మేతకు అల్లాడిపోతున్నవి. కాబట్టి ప్రతి గ్రామంలోనూ చౌకడిపోలు గంజికేంద్రాలు పెట్టించాలి. కరవు పనులు చూపించాలి, పశువులకు కొంత గడ్డిని సరఫరా చేయించాలి."

## కర్నూలు జిల్లా

కోయిలకుంట్లనుండి మావిలేఖరి యిలా వ్రాస్తున్నాడు: "ప్రస్తుత పరిస్థితిని బట్టి చూస్తే, యీ ప్రాంతంలో కని విని ఎరుగనట్టి కరవు సంభవించేట్లుగా కన్పిస్తున్నది. గత సంవత్సరం కోవెలకుంట్ల బనగానిపల్లి తాలూకాలలో కొన్ని గ్రామాలలో మాత్రమే పంటలు పోయినవి. కాని యీ సంవత్సరం, సకాలంలో వర్షాలు లేనందున యీ రెండు తాలూకాలలోనూ, ముంగారుపైరు బొత్తిగా వేయలేదు. మెట్టపైర్లు జొన్న కొర్ర, అరక మొదలగువానికికూడా అదను దాటపోతున్నది. ఇప్పటికైనా వర్షంపడేసూచన లేదు. ఎండలు సెనగకాలంలోవలె కాస్తున్నవి. మామూలుగా యీ కాలంలో పశువులకు కావలసినంత మేత ఉండేది. కాని మే నెల వరదలలో, పశుగ్రాసం పాడైపోయింది. రాబోవు ముందునున్న తిండికరవుకన్నా కూడా ప్రస్తుతం పశువులకు మేతకరవు రైతులకు చాలా ఆవేదనకరంగా ఉన్నది."

### మార్కాపురం తాలూకా

మార్కాపురం, సెప్టెంబరు 18: కర్నూలు జిల్లా కలెక్టరు పి. వి. నాయుడు గారు ఈ తాలూకాలోని క్షామ పీడిత ప్రాంతాలైన అమానిగుడిపాడు, పుల్లలచెరువు, గంగపవరం, యర్రగొండపాలెం గ్రామాల సందర్శించి, అందు అమానిగుడిపాడు పుల్లలచెరువు, మురారిపల్లి, కొత్తకోట, గుండవరం, సీతాపురం, యర్రగొండపాలెం, కొండలపాడు, బొమ్మవరం, యర్రగొండపాలెం, కొండలరాయుని, జీవరాపల్లి గ్రామాలకు సెందిన ప్రజలకు బట్టలుపంచి పెట్టారు. కలెక్టరువారి పర్యటనలో అనేకచోట్ల ప్రజలు నానా యిబ్బందులు పడుచు, అన్నానికి అలమటించుచున్నారని గంజికేంద్రముల నెలకొల్ప వలసినదని కరవుపనుల ప్రారంభించవలసినదని విన్నవించుకొన్నారు. పరిస్థితులు చాలా విషమంగా ఉన్నవి. ప్రస్తుతమున 36 గంజి కేంద్రములకు తోడు యింకా 25 గంజి కేంద్రముల నెలకొల్పుటకు కలెక్టరువారు ఉత్తర్వు లిచ్చిరని తెలిసినది. స్వ. వి.

## అనంతపురం జిల్లా

హిందూపురం తాలూకా సోషలిస్టు పార్టీ కార్యదర్శి, సి. వి. సుబ్బయ్యగారిలా వ్రాస్తున్నారు. "బుసుపులు లెక్కపెట్టుకొంటూ, రైతులు వర్షంకోసం ఆకాశంవైపు చూస్తున్నారు. ఉత్తరకార్తెవచ్చిన చినుకు పడలేదు. ఉత్తర త్తైంది. అప్పుడే తాలూకాలో నీటి ఎద్దడి దాపురించింది. తాలూకా ముఖ్యపట్టణమైన హిందూపురంలో నే బావుల్లో నీళ్లులేక ప్రజలు గిజగిజలాడుతున్నారు. చలమత్తూరు, గోరంట్లఫిర్కా గ్రామాలలో పరిస్థితులు మరీ అధ్వాన్నంగా ఉన్నది. గంజికేంద్రాలైనా అన్ని ఫిర్కాలలో లేవు. విధవలు, కుంకి కష్టాలు గాదిరాను, కష్టాలిగట్టు తింటూ ప్రాణాలు దక్కించుకొంటున్నారు. కరవు నివారణకుగాను ప్రభుత్వం వెంటనే యీ దిగువపనులు ప్రారంభించడం అవసరం. గోరంట్లఫిర్కాలో మేరెడ్డిపల్లివద్ద చిత్రావతినదికి అనకట్ట కట్టిన 800 ఎకరాలు సాగవుతుంది. బూదిలిగ్రామంవద్ద చిత్రావతిలో నుండి కట్టకాలువ త్రవ్విన గోరంట్లవద్ద రాలీకూటు, వాగలుకుంట్లలో నీళ్లు నిలపను. ఈ నీళ్లతో 800 ఎకరాలు సాగు చేయవచ్చు. చిత్రావతినుండి గంగంపల్లి చెరువును, మేరెడ్డిపల్లెవద్ద కాలువ త్రవ్వితే 400 ఎకరాలకు నీరు పారుతుంది. బూదలి గ్రామంవద్ద కాలువ నల్లగోరంట్ల చెరువునుండి 600 ఎకరాలు సాగు చేయవచ్చు. చిలమత్తూరుఫిర్కాలో పుట్టపర్తివద్ద చిత్రావతినుండి కాలువ తీయించి చెరివిందల చెరువుకు నీరు సరఫరాచేసిన 700 ఎకరాలు సాగవుతుంది. సంతేబిదనూరు, జేపనాల్లి, సంజీవరాయనిపల్లి కేరినెర, చౌలూరు మున్నగుగ్రామాల చెరువులు లోతు చేయించాలి.

### మడకశిరా తాలూకా

తాలూకా కాంగ్రెసుసంఘ కార్యవర్గ అధ్యక్ష కార్యదర్శులు, సి. వి. ఆనంద కృష్ణయ్య, హెచ్. నరసింగరావు, సభ్యులు జి. రామశాస్త్రి, పి. అనంతరాజుగారలు గత 17 వ తేదీన అనంతపురం జిల్లా కలెక్టరు జి. రామిరెడ్డిగారివద్దకు రాయబారంవెళ్లి తాలూకాలోని తీవ్ర క్షామపరిస్థితులను వివరించి, తక్షణము అమలు జరుపవలసిన కార్యక్రమాన్ని తెలియజేశారు. ఆ కార్యక్రమంలో యీదిగువ పనులు సూచించారు. ఛత్రం, బొమ్మసంద్ర హాళ్లి అగ్రహారం చెరువులు మరమ్మతు చేయించాలి. అగళి మడకశిర పంట కాల్వలను మరమ్మతు చేయించాలి. బావన కాలువ, గౌరిశెట్టి కాలువలను పునరుద్ధరించి, హగళి చెరువుకు, కాలువూరు చెరువుకు ఏటి కాలువలను మలపాలి. బీదరైతులకు తక్కావీ బుణాలను విరివిగా యిప్పించాలి. కూలీలకు పనులు కల్పించాలి. గ్రామ గ్రామాన చౌకడిపోలు పెట్టించాలి. జిల్లా కలెక్టరుగారు సావధానంగా విని చేతనైన సహాయం చేసెదమని అన్నారు.

### ధర్మవరం తాలూకా

ఈ తాలూకా పరిస్థితులను గురించి మా ధర్మవరం విలేఖరి యిలా వ్రాస్తున్నాడు:

"ఈ తాలూకాలో ఈయేడు క్షామం తప్పనట్లే. సాధారణంగా యీ కాలంలో చెరువులక్రింద పైరు పచ్చలతో కళకళలాడే భూములు ఈయేడు ఎడారులలా కన్పిస్తున్నవి. ఒక్క ఈ ఊరి చెరువు క్రింద నే 2 వేల ఎకరములు బీడుపడిపోయింది. ఉత్తరకార్తె ప్రవేశించినా చినుకు పడనందున రైతులలో నిరాశ ప్రబలమైంది. పశువుల మేతకు గడ్డి లేదు.

అనేకులు ఒంటిపూటతిండితో గడుపుతున్నారంటే అతిశయోక్తి గాదు. దీనికితోడు అరవదేశము నుండి వచ్చు బిచ్చగాళ్ల సంఖ్య పెరిగిపోతున్నది. పగలనక, రాత్రనక, వీరు ఎల్లప్పుడు బిచ్చానికి బయలుదేరి, అసలే దుస్థితిలో ఉన్న గృహస్థులను చికాకు కలిగిస్తున్నారు. ఇంకా నేటివరకు వేరశెప్ప పని లేదు. ధర్మవరములో, నీటికి ముఖ్యాధారమైన చెరువు వట్టిపోయినందున జొన్నలు పైనుంచి తెప్పించారు. అంతో, యింతో చెరువులో ఉన్న నీరు అది పోవడమున్నందున బోర్డులో నీరు అడుగంటినది. పంచాయితీ బోర్డువారు, ప్రభుత్వమువారు, తదితర ప్రముఖులు శీఘ్రంచరణ్యకుండా నీటిసమస్య కలిగింపకపోయిన పరిస్థితి విషమించిపోవచ్చు.

పుట్టకనాండ్ల నుండి చేపలు పోయినవి. అప్పుడప్పుడు నానాటికి నీరు యిమ్మ వారు లేరు. కోస్తాలో కూలిసంఖ్య కూడా తగ్గినట్లు తెలుస్తున్నది. పేమారు ప్రాజెక్టు క్రింద కాలువ త్రవ్వ కంపెనీకి రోజు వందలకొలదీ జనం వెదుకుతున్నారు.

కదిరితాలూకా:- ఈ తాలూకాలు తుంగాది కూలిజనం జీవనోపాధికి పనులులేక అల్లాడుతున్నారని, కడపనుండి రాయచోటి గాలివీడు కదిరి గోరంట్ల మీదుగా హిందూపురమునకు రైలుమార్గం వేయుటకు ప్రభుత్వంవారు సంకల్పించినచో, వీరందరికీ పనికల్పించినట్లవుతుందని అనంతపురం జిల్లా కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడు ఎ. వి. రమణప్పగారు సూచిస్తున్నారు.

## బళ్లారి జిల్లా

మద్రాసు శాసనసభ సభ్యుడు టి. మల్లయ్యగారు యిలా వ్రాస్తున్నారు.

"బళ్లారిజిల్లాలో, బళ్లారిరాయదుర్గం తాలూకాలలో క్షామపరిస్థితు లేర్పడినట్లు పై తాలూకాలలో పర్యటించి, స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి శంకరరెడ్డి, గారలు ప్రకటించారు. కాని ఆదవాని ఆలూరు తాలూకాలలో పరిస్థితులు యింకు కేవలము భిన్నంగా లేవు. గడచిన ఐదారు సంవత్సరాల కంటె యీనాడేమీ పుష్కలంగా పంటలు పండుతాయని రైతులు ఆశించారు. కాని ఆశలు అడియాసలైనవి. మంగారు పంటలు ఎండిపోయినవి. ఈకార్తెలో కూడా వర్షం లేకపోతే పరిస్థితి మరింత దుర్భరమౌతుంది. ప్రస్తుతం పనిపాటలులేక అవస్థ పడుతూ కూలిజనంకోసం, తుంగభద్ర కాలువ త్రవ్వకం పని ప్రారంభించడం అవసరం.

## రాధాకృష్ణన్ ఉద్ఘాటన

[1 వ పేజీ తరువాయి]

వి. నారాయణరావుగారు సభలో చదివారు. ఈసమితి ఈకృషికి ఉపోద్బలకంగా విరాళాలు ఇచ్చిన దాతల పేర్లను శ్రీ సంజీవరావుగారు సభకు పరిచయం చేసారు. స్వామి జ్ఞానానంద వెయ్యి రూపాయలు, శ్రీమతి కృష్ణవేణమ్మ 5 వందలు, శ్రీ సి. ఎస్. మూర్తి 5 వందలు, శ్రీ అయ్యన్న నాయుడు ఒక ఎకరం డెల్టా భూమి, శ్రీ సంజీవరావు 5 వందలు. శ్రీ భూపతిరాజు రామరాజు 2 వందలు, స్వామి ప్రజ్ఞానానంద ఒక వంద, ఆంధ్ర మహిళాసభవారు 116 లు, ఇవి ఈ సభలో చదివిన విరాళాలు.

ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణ తమ ఉపన్యాసంలో విద్యా, దాని విలువలు మీద విపులంగా మాట్లాడారు. ప్రస్తుత విద్యా విధానంలో నైతికము, ఆధ్యాత్మికము అయిన విలువలకు ప్రాధాన్యం తగ్గి, మానసిక విషయకమైన విలువలకు ప్రాముఖ్యం హెచ్చింది. అయితే పౌరసత్వానికి నైతిక మైనట్టిన్నీ, ఆధ్యాత్మికమైనట్టిన్నీ విలువలే ముఖ్యమైనవని చెప్పారు. పూర్వకాలంలో విద్యా ప్రారంభమంతంలో అతి ప్రాధాన్యం వహించివుంది, ఆ విద్యార్థిని ఒక గురువుకు అప్పగించడం, ఆగురువు అతనిలో నైతిక, ఆధ్యాత్మిక జీవితాన్ని దిద్దడం, ఈ విధంగా వుండేది. విద్యా అధ్యయనం అన్నది ఆరోజుల్లో ఒక వెలుగు దారిగా వుండేది. ఆత్మోద్దీపకంగా వుండేది. అది ఈరోజుల్లో చెపుతున్న విద్యలో గాని, విధానపద్ధతిలో గాని కన్పించదు. మన దేశంలో మనస్సు యొక్క ధారణశక్తి తగ్గిందని, మేధస్సు క్షీణించిందని కాదు నేను అంటున్నది. ఆ మనస్సుకు ఆధ్యాత్మిక బలాన్ని, ఆ విద్యార్థికి నైతికసంపత్తిని సమకూర్చి, విద్యార్థిదశలో నేర్చుకున్న ఆశయాలను ఆచరణలో పెట్టడానికి అతణ్ణి ఉన్ముఖుణ్ణి చేసే అసలైన యీ రోజులనాటివిద్య కల్గించలేకపోతున్నది.

అసలువిద్యను పిల్లలకుగరపాలంటే, దాన్ని ఆ పిల్లల మాతృభాషలో నే గరపాలి. ఇది చిరంతనమైనసత్యం. అందువల్ల ఢిల్లీఆంధ్రులు తమపిల్లలకు తెలుగుచదువు లభించాలి అన్న ఉద్దేశంతో చేస్తున్న ఈ ప్రయత్నం సార్థకమే. అదీకాక, హిందీలో గూడా పిల్లలకు పాఠాలుచెప్పించడానికి యీ సమితివారు ప్రయత్నం చేస్తూవుండటంలో, అట్టిఅనుమానం ఏలవలేదంటున్నా అదికొంతా పరిహార్యమౌతున్నది.

ఈ సమితివారు ప్రారంభించిన ఈ ఉద్యమం ఇప్పుడు అల్పంగావున్నట్లు కన్పిస్తున్నది. అయితే, మహాదారం భాలు గూడా ఆదిలో అల్పంగా వున్నట్లే కన్పిస్తాయి. డా॥ రాధాకృష్ణన్ యీ మాటలు చెబుతూ వుండగా, ఒకరైలు ప్రమోతి చేసుకుంటూ పోయింది. దాన్ని సభికులకు చూపి, మనం పిల్లలకు చేతిపనుల్లోను, లలితకళలలోను గూడా ప్రవేశం కల్గించవలసివున్నదని చెప్పడానికే ఈరైలు ఇప్పుడువచ్చింది అని ఛలోక్తిగా అన్నారు. ఈసమితివారు నెలకొల్పుతున్న ఈవ్యవస్థవారు చేతిపనులను, లలితకళలను విస్మరించడం తగదని, ఈరైలు హెచ్చరిస్తున్నది. అది చేసే ప్రమోతి చెబుతున్నఔచిత్యం అదే అన్నారు.

అనంతరం స్థానికమంత్రి శ్రీనందా శంకుస్థాపన చేశారు. ఆసందర్భంలో ఆయన ఈవిధంగా ఉపన్యసించారు: ఈశంకుస్థాపన చేయడం నిమిత్తం పడేకాయకష్టం అతి అల్పమైంది. ఈ కష్టం అల్పమైనదే అయినా సామ్రాజ్యదయంలో ఈసంస్థ ఎంతో వృద్ధిలోకి రావాలని భగవంతుణ్ణి గూర్చి నేను చేస్తున్న ప్రార్థనలుమాత్రం అతి దీర్ఘమైనవి. ఈ సమితివారు చేస్తున్న ఈ పని ఎంతో మంచిపని. జగద్హితమైనపని. నిర్మాణాత్మకంగా సాగించ నిశ్చయించుకున్న వీరికృషిలో, పిల్లలకు పాఠశాలను నిర్మించాలి అన్న సంకల్పమే అసలు చరితార్థమైంది. మనం విద్యావిషయకంగా వెనకబడివున్నాం. మనవిద్యాప్రమాణంగూడా అధోగతిలోవుంది. డా॥ రాధాకృష్ణన్ మనకు ఏదో సమ్మోహం షే ధిస్తుందన్నారు, కాని నాకు అనుమానంగా వుంది. అనేకమైన సెలక్షను కమిటీలవద్ద పరీక్షలకు నిలుస్తున్నవారి తెలివినిబట్టిచూస్తే, మనదేశంలో విద్యాప్రమాణం హీనస్థితిలో వుందని చెప్పక తప్పదు.

మన దేశంలో విద్యనుగూర్చి, విద్యాపద్ధతినిగూర్చి పెద్దలు చెబుతున్నమాటలను వింటున్నాం. మనదేశంలో విద్య ఏకముఖమైనదని వీరు అంటున్నారు. దేశంయొక్క అభ్యుదయ వికాసాలకు ఇట్టిది ఎంతమాత్రం పనికిరాదనికూడా వీరు చెబుతున్నారు. ఈ విద్యవల్ల నే మన విద్యార్థుల నడవడికగూడా సతతం అపసవ్యమార్గాల్లో పడిపోతున్నదని పేర్కొంటున్నారు. ఇదంతా బాగానే వుందిగాని, విద్యార్థులను అట్లా అనడం మాత్రం నాకు నచ్చడంలేదు. అందులో కొంత అతి హాను కన్పిస్తున్నది. దేశంలో పరిస్థితులు ఎట్లా వున్నాయో, అవే వారిలో ప్రతిఫలిస్తున్నాయి. అయితే, యీ మాటలు అన్నానని, విద్యార్థుల నడవడికను బలపరచడంగా భావించకండి. పూరికే అసలు సంగతి చెప్పాను.

అనంతరం ఢిల్లీరాష్ట్ర విద్యామంత్రి మాట్లాడారు. ఆయన శ్రీమతి దుర్గాబాయి ఈవిషయంలో చేసిన కృషిని అభినందించారు. శ్రీమతి దుర్గాబాయిదగ్గర ఒక తెలివితేటలు వున్నాయి. పదిమంది మనుష్యులు పోగుచేయడం, వారిచేత పది మంచిమాటలు చెప్పించడం ఆమె ప్రత్యేకత. అయితే ఇట్టిపని ఆమె ఒక్కతే వల్ల ఏమిఅవుతుంది? పదిమందిగూడా ఇందుకు తోడుపడి, ఇట్టి అర్థకార్యాలు నిర్విఘ్నంగా కొనసాగేటట్లు చూడాలి అని ఆయన అన్నారు. ఢిల్లీ పెద్దదైపోతున్నది. అనేకరాష్ట్రాలవారు ఇచ్చటకు వస్తున్నారు. అందువల్ల వారివారి భాషల్లో, వారివారి పిల్లలకు చదువు చెప్పించుకునేందుకు ఇట్టి ప్రయత్నాలు జరగడం హర్షించదగిన విషయం. అందువల్ల శ్రీ దుర్గాబాయి ఆదిగాగలవారి ఈ కృషికి సంతోషించి. ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వం, తెలుగు పిల్లలకు పాఠశాల నిమిత్తం స్థలాన్ని ఉచితంగా ఇచ్చింది అని ఆయన చెప్పారు.

ఢిల్లీ ఆంధ్ర విద్యా సమితి కార్యదర్శి శ్రీ గోవిందలక్ష్మన్న సభకు వచ్చి, ఉత్సవాన్ని జయప్రదం చేసినవారి నందరికి ధన్యవాదాలు సమర్పించారు. ఈ సమితి పాఠశాలా భవన నిర్మాణ సందర్భంలో ఎక్కువగా ఉత్సాహాన్ని చూపుతూ, చురుకుగా పని నెరవేరుటకుగాను తీవ్రంగా కృషి చేస్తున్న ఇంజనీర్లు డా॥ లక్ష్మణరావు శ్రీ ఎ. జి. కె. మూర్తిగార్లకు కృతజ్ఞతను తెలియచేశారు.

## రామమూర్తిగారి అభిభాషణ

(1-వ పేజీ తరువాయి)

"పద్మరాజుగారు ఒక కథ వ్రాశారు, మామూలుగా కథ కంచికి వెళ్లింది అనేవాళ్లం. ఆయన కథ ఢిల్లీవెళ్లి న్యూయార్కు వెళ్లి అంతర్జాతీయ ప్రఖ్యాతి పొంది మనదేశానికి గౌరవం ఏర్పడింది.

కళ ఆంధ్రులసొమ్ము. చిత్రకళకు అజంతా, శిల్పానికి ఎల్లోరా, అమరావతి, సంగీతానికి త్యాగరాజు చిహ్నాలు. 40 ఏండ్లుగా పద్యగద్యరచనల్లో ఆంధ్రులు బాగా రచనలు చేస్తున్నారు. హృదయం ఆనందమయమైనప్పుడు ఉత్తమ కళారచనకు ఆధారము."

పాలగుమ్మి పద్మరాజుగారు తమకు సంఘంవారు చేసిన సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ ఈ తమ రచయితలు ముందు ఇంగ్లీషులో ఆలోచించుకొని వ్రాసుకొని, తెనుగులో వ్రాయడానికి అలవాటుపడిపోయారనీ, తెలుగువారి రచనల్లో తెనుగుతనమూ, తెనుగుభావమూ, తెనుగుజీవనమూ తొణికిసలాడాలనీ అన్నారు. సంస్కృతం అనేది కేవలంచదువుకొన్నంతమాత్రాన అలవడేదిగాదనీ, తెనుగుభాష, తెనుగు సంస్కృతి, వికాసానికి తెనుగువారంతా కృషిచేసి, తెనుగుభాషను ఒక విశిష్టస్థానాన్ని సంపాదించాలనీ అన్నారు.

సంఘ కార్యదర్శి జొన్నలగడ్డ సాంబశివశాస్త్రిగారి అభివందనాలతో సభ ముగిసింది.

## హైదరాబాదులో నెహ్రూ కార్యక్రమం

హైదరాబాదు, సెప్టెంబరు 21

హైదరాబాదులో నెహ్రూ కార్యక్రమం ఇదివరకను కొన్నట్లు కాక కొద్దిగా సవరింపబడింది. చివరికిప్పుడు కచ్చితంగా నిర్ణయింపబడిన కార్యక్రమమిది.

24 వ తేదీ: మధ్యాహ్నం 11-30 గంటలకు బేగంపేట విమానాశ్రయంలో అవతరణ; సాయంత్రం ఎర్రగడ్డ క్షయ ఆసుపత్రిలో కొత్తగా కట్టిన వార్డుల ప్రారంభోత్సవం.

25 వ తేదీ: ఉదయం 8-30 గంటలకు సికిందరాబాదు జింఖానా మైదానంలో హైదరాబాదు సికిందరాబాదు కార్పొరేషన్ల సంయుక్త పౌరసన్మానం; సాయంత్రం 4-30 గంటలకు ఫతేమైదానంలో బహిరంగ సభ; తర్వాత 6-15 గంటలకు ఉస్మానియా విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలరుతోను సెనెట్ సభ్యులతోనూ ముచ్చటింపు అది అయిన తర్వాత భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యకర్తలతో 'టీ పార్టీ' అతిథి మందిరంలో విందు.

26 వ తేదీ: ఉదయం 7-30 గంటలకు విమానంలో బీదరుకు పయనం, అక్కడ 9-30 గంటలకు బహిరంగ సభ మధ్యాహ్నం 2 గంటలకు అక్కడి నుంచి కారులో ఉస్మానాబాదుకు పయనం దారిలో జహీరాబాదు కుష్ఠురోగుల కాలనీ తనిఖీ,

27 వ తేదీ: ఉదయం 8 గంటలకు ఉస్మానాబాదులో బహిరంగసభ, 1 గంటకు లాటూరు మీదుగా తిరిగిబీదరుకు చేరిక అక్కడనుంచి విమానంలో హైదరాబాదుకుపయనం; సాయంత్రం 4 గంటలకు నిజాం కళాశాల విద్యార్థులసభలో ప్రసంగం; 5-30 గంటలకు పబ్లిక్ గార్డెన్సులో ప్రభుత్వం వారి విందు; తర్వాత 7 గం.కు కాంగ్రెసు ప్రచారకుల సభలో ప్రసంగం.

18 వ తేది ఉదయం హైదరాబాదు స్టేట్ బ్యాంకు నూతనభవనానికి శంకుస్థాపనచేసి, నెహ్రూగారు వెంటనే ఢిల్లీకి విమానమెక్కుతారు.

## మదరాసు ధరలు

మదరాసు సెప్టెంబరు 22

బంగారం-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-8 ఎర్వుబుక్కొన్న పేజ్పుటాభ్యులోవహా రు. 12 4 0 పెట్టుబంగారు తులం 91 4 0 మూర బంగారు 89 4-0 పేరువెండి తులం 100. (వెడి) 162 8 0 వెండితులం1-8 1.11 0

వేరుశెనగ: (531 వీ 1-8 ఎమ్బుకోట్ గిడంగుల మెషిన్ - పేజ్పుటాభ్యుల్ వహా)

| | | |
|---|---|---|
| పెదపరుకు | రు | 160-0-0 |
| వేరుశెనగమూనె ఎక్సుపెల్లర్ విలో 3% (500వీ) కెడి రు ఎల్లదర | | 325-0 0 |

పింగాయ మూత (37½ పౌనులు గం)

| | | |
|---|---|---|
| అంబమూర్కు | రు | 29 6.9 |
| ఏం ఎవ్ (గాండ్ డబ్బా) | రు | 29-5-9 |
| పి ఎస్ ఆర్ బ్రాండు | రు | 29-8-9 |
| ఎన్. | రు | 29-8-9 |
| ఎ. | రు | 29-4-9 |

ఆముదం

500 పౌనుల గంజాడవ ఒకటికి

| | | |
|---|---|---|
| తిరువత్తూరు | రు | 320 0.0 |
| వరస రావుపేట | | [illegible] |

పంచదార

| | | |
|---|---|---|
| చోం: పేట | రు | 39.0 9 |
| పూరిస | రు | 39 0.9 |

## హైద్రాబాద్ మార్కెట్ ధరలు

(సప్లయిదారు సుబ్బా బుచ్చయ్యగారి వంకటేశం)

హైద్రాబాద్, సెప్టెంబరు 22

| | |
|---|---|
| బంగారం తు 1-కి | 104-8-0 |
| వెండి 100 తు | 188-0-0 |
| పసుపు పల్లా | 85 57 |
| పెసలు | 55-59-8-0 |
| కందులు | 53-0-0, 60-0-0 |
| మినుములు | 60-0-0-62-0-0 |
| లంకెలు | 55-0-0-56-0-0 |
| ఉలవలు | 40-40-8-0 |
| కందిపప్పు పెద్దది | 74-77 |
| కందిపప్పు చిన్నది | 72-0-0 |
| పెసరపప్పు | 82-8-0 |
| మినపపప్పు | 87-0-0. 88 |
| వేరుశెనగపప్పు | 84-0-0 |
| ఆముదాలు | 70-11-0-79-13-0 |
| చింతపండు | 65-25 |
| మిర్చి | 50-0-0, 88-0-0 |
| కుసుములు | 48-0-0 48-0-0 |
| ధనియాలు | 11-0-0-12-0-0 |
| ఆవాలు | 12-0-0-12-8-0 |
| ఉల్లిగడ్డలు | 10-8-0 17-0 0 |
| నువ్వులు | 88-100-(?) |

## బొంబాయి మార్కెట్

బొంబాయి, సెప్టెంబరు 22: ఇవాళ స్థానిక మార్కెట్‌లో వెండిబంగారం ధరలు నిలకడగా వున్నవి. వెండి నూరుతులాలు రు 160-2-0 బంగారం తులం రు. 89-6-0 చవరకు 61-1-0.

